APTEL 15625

అటవీశాఖ సమాచార పత్రిక

# వన సంరక్షిణి

మే 2018

సంపుటి : 1 సంచిక : 5



## హరితాంధ్ర నిర్మాణంతోనే సుస్థిర అభివృద్ధి

**ప్రధాన ముఖ్య అటవీసంరక్షణాధికారి (అటవీదళాధిపతి శ్రీ పి మల్లికార్జునరావు)**
**ఎపి ఫారెస్ట్ అకాడమిలో ఘనంగా ఎఫ్‌బిఓల స్నాతకోత్సవం**




రాష్ట్రాన్ని హరితాంధ్రప్రదేశ్‌గా తీర్చిదిద్దినప్పుడు మాత్రమే సుస్థిర అభివృద్ధి సాధ్యపడుతుందని ఆంధ్రప్రదేశ్ అటవీశాఖ ప్రధానముఖ్య అటవీసంరక్షణాధికారి (అటవీదళాధిపతి) శ్రీ పి మల్లికార్జునరావు అన్నారు. ఏప్రిల్ 0వ తేదీ సోమవారం రాత్రి రాజమహేంద్రవరం లాలాచెర్వులోని ఎపి స్టేట్ ఫారెస్ట్ అకాడమిలో జరిగిన స్నాతకోత్సవంలో ఆయన ముఖ్యఅతిథిగా పాల్గొన్నారు. ఆరుమాసాల శిక్షణ పూర్తి చేసుకుని విధుల్లో చేరుతున్న 28మంది ఫారెస్ట్ బీట్ అధికారులకు ఆయన సర్టిఫికెట్లు అందజేశారు. వివిధ విభాగాల్లో ప్రతిభ చూపిన ట్రెయినీలకు పతకాలను ప్రదానం చేశారు. ఈ సందర్భంగా ఆయన మాట్లాడుతూ అడవిని అభివృద్ధి చేయడం అనే లక్ష్యం సాధించాలంటే ఉన్న అడవిని సక్రమంగా కాపాడడం ప్రధానమన్నారు. అటవీశాఖలో ఉద్యోగం అనేక లక్ష్యాలతో కూడుకున్న అత్యున్నత కర్తవ్యమని చెప్పారు. వన్యప్రాణుల రక్షణ, అటవీభూముల పరిరక్షణ, మొక్కల పెంపకం, అటవీప్రాంతం అభివృద్ధి, ప్రజాచైతన్యం, ఎకో టూరిజం, మొక్కల జాతులపై పరిశోధన, అడవిపై ఆధారపడిన గిరిజనుల సంక్షేమం.. ఇలా అనేక లక్ష్యాలను ప్రతి అటవీశాఖ

మిగతా 2 లో..

## జూన్ 5న ప్రపంచ పర్యావరణ దినోత్సవం

**ప్లాస్టిక్ కాలుష్య నివారణ ఈ ఏటి నినాదం**

భారత పర్యావరణ అటవీ, వాతావరణ మంత్రిత్వశాఖ జూన్ 5వ తేదీన ప్రపంచ పర్యావరణ దినోత్సవాన్ని ఐక్యరాజ్యసమితి (పర్యావరణ విభాగం) సౌజన్యంతో పెద్ద ఎత్తున నిర్వహించేందుకు సన్నాహాలు చేసింది. ఈ ఏడాది పర్యావరణ దినోత్సవ థీమ్‌గా ప్లాస్టిక్ కాలుష్య నివారణను ఎంచుకోవడం జరిగింది. ఇందులో భాగంగా రక్షిత ప్రాంతాలు, జాతీయ వనాలు, అభయారణ్యాలలో ప్లాస్టిక్ వ్యర్థాలు, కాలుష్యాల నివారణకు ప్రత్యేక కార్యాచరణ చేపట్టాలని మంత్రిత్వశాఖ కోరిందని రాష్ట్ర ప్రధాన ముఖ్య అటవీసంరక్షణాధికారి (అటవీదళాధిపతి) శ్రీ బి మల్లికార్జునరావు తెలిపారు. ఈ నేపథ్యంలో అన్ని అటవీసర్కిళ్ళ అధిపతులు ప్రత్యేక కార్యాచరణ కింద కార్యక్రమాలు చేపట్టి వాటి నివేదికను తమకు, మంత్రిత్వశాఖకు అందజేయాలని ప్రత్యేక సర్క్యులర్‌లో ఆదేశించారు.

**పర్యావరణ దినోత్సవం - ముఖ్యాంశాలు**

పర్యావరణ దినోత్సవం నాడు వివిధ ఏజెన్సీలు, విభాగాల ద్వారా కాలుష్య నివారణ, ప్లాస్టిక్ వ్యర్థ, కాలుష్య పదార్థాల నిర్మూలనకు

మిగతా 2 లో..

## సీడింగ్‌కు విస్తృత ప్రాధాన్యత

అటవీప్రాంతంలో విత్తనాలు నాటడం, ఏరియల్ సీడింగ్ కార్యక్రమాలకు విస్తృత ప్రాధాన్యత ఉంది. దీనికి సంబంధించి 2016 జనవరి 20న నాటి ప్రధాన ముఖ్య అటవీ సంరక్షణాధికారి (పిసిసిఎఫ్) శ్రీ ఎస్‌బిఎల్ మిశ్రా జారీ చేసిన సర్క్యులర్‌లోని ముఖ్యాంశాలు... విత్తనాలు నాటడం, ఏరియల్ సీడింగ్ కార్యక్రమాల్ని పెద్ద ఎత్తున చేపట్టాలని ముఖ్యమంత్రి శ్రీ చంద్రబాబు నాయుడు సూచించారు. వైజాగ్, విజయవాడ మరియు గుంటూరు సిఆర్‌డిఎ ప్రాంతాలతో పాటు ఋతుపవన వర్షాలు కురిసే చిత్తూరు జిల్లా వంటి ప్రాంతాల్లో 2015-16లో ఏరియల్ సీడింగ్, విత్తనాలు నాటేందుకు అటవీశాఖ కృషిని ఆయన ప్రశంసించారు. పరిధి, విస్తృతి పరంగా దేశంలోనే

మిగతా 2 లో..

# హరితాంధ్ర నిర్మాణంతోనే సుస్థిర అభివృద్ధి





మెదటిపేజీ తరువాయి ...
ఉద్యోగి తన విధినిర్వహణలో భాగంగా సాధించాల్సి ఉంటుందని పేర్కొన్నారు. ఇంత వైవిధ్యమైన విధులున్న ఉద్యోగం మరొకటి ఉండబోదని చెబుతూ భావితరాలకు ప్రాణావసరమైన పర్యావరణాన్ని, అడవుల్ని కాపాడే విధిలో ఉన్నందుకు ప్రతి అటవీఉద్యోగీ గర్వించాలన్నారు.

**అకాడమీ ఇక్కడే అభివృద్ధి చెందుతుంది**

ఫారెస్ట్ అకాడమిని రాజమహేంద్రవరంలోనే పూర్తిస్థాయిలో అభివృద్ధిపర్చేందుకు రాష్ట్రప్రభుత్వం కృతనిశ్చయంతో ఉన్నదని శ్రీ మల్లికార్జునరావు తెలిపారు. త్వరలోనే ఇక్కడ భవననిర్మాణం, ఇతర సదుపాయాలు కూడా చేకూరగలవని ఆశాభావం వ్యక్తం చేశారు. గత డిసెంబర్‌లో తాను వచ్చినప్పటికీ ఇప్పటికీ అకాడమి ఎంతో అభివృద్ధి చెందిందని చెబుతూ ఇందుకు కృషి చేసిన అధికారులను అభినందించారు. ప్రతి ఉద్యోగి తన పనివలన ఫలితం కనిపించాలని, అది సమాజంపై మంచి ప్రభావం చూపించాలని కోరుకుంటూ గట్టి పట్టుదలతో పనిచేయాలన్నారు. అకాడమి ఇన్‌చార్జి డైరెక్టర్, రాజమండ్రి సర్కిల్ ముఖ్యఅటవీ సంరక్షణాధికారి శ్రీ జెఎస్ఎన్ మూర్తి మాట్లాడుతూ శిక్షణ పరంగా అత్యున్నత ప్రమాణాలను పాటిస్తున్నామని తెలిపారు. ఇక్కడ పొందిన శిక్షణను భావి ఉద్యోగ జీవితంలో సద్వినియోగం చేసుకోవాలని సూచించారు. నైతికవిలువలను పాటిస్తూ వృత్తిధర్మాన్ని నిజాయితీగా నిర్వర్తించాలని కోరారు. సభలో కాకినాడ డిఎఫ్ఓ డాక్టర్ శ్రీమతి నందని సలారియా, డిఎఫ్ఓ (వైల్డ్‌లైఫ్) అనంత్‌శంకర్, అకాడమి డిప్యూటీ డైరెక్టర్ ఎంవి ప్రసాదరావు, ఫ్యాకల్టీ సభ్యులు రమణ, ఉదయశంకర్, జోజిబాబు, రాజేంద్రప్రసాద్ తదితరులు పాల్గొన్నారు. అటవీ అకాడమి లోగోను, వనసంరక్షకుల ప్రవర్తనానియమావళి పుస్తకాన్ని ఈ సభలో పిసిసిఎఫ్ శ్రీ మల్లికార్జునరావు ఆవిష్కరించారు.

**వనదేవత విగ్రహావిష్కరణ, సమావేశ మందిర ప్రారంభం**

అకాడమి ప్రాంగణంలో నెలకొల్పిన వనదేవత విగ్రహాన్ని స్నాతకోత్సవానికి ముందు ప్రధాన ముఖ్య అటవీ సంరక్షణాధికారి శ్రీ మల్లికార్జునరావు ఆవిష్కరించారు. దివంగత ఐఎఫ్ఎస్ అధికారి కూరాకుల వెంకయ్య స్మారక సమావేశమందిరాన్ని ప్రారంభించారు. శిక్షణ పొందుతున్న ఉద్యోగుల గౌరవ వందనాన్ని స్వీకరించారు. ఎగ్జిబిషన్‌ను, బటర్‌ఫ్లై పార్కును, అకాడమీ ప్రాంగణంలో జరిగిన అభివృద్ధి పనులను పరిశీలించారు.

# సీడింగ్‌కు విస్తృత ప్రాధాన్యత

మెదటిపేజీ తరువాయి ...
ఇదొక వినూత్న కార్యక్రమమని పేర్కొన్నారు. అడవుల్లో విత్తనాలు నాటే కార్యక్రమాన్ని భారీ ఎత్తున అటవీశాఖ అధికారులు చేపట్టి విజయవంతం చేయడం ప్రశంసనీయ మన్నారు. సీడింగ్‌కు సంబంధించిన సూచనలు: ఏరియల్ సీడింగ్, విత్తనాలు నాటే కార్యక్రమం విజయవంతం కావాలంటే ముఖ్యంగా ఆయా స్థానిక విత్తన జాతులను ఎంచుకోవాలి. అలాగే విత్తనం అత్యుత్తమ నాణ్యత కలిగినదై ఉండాలి. పరిపక్వమైనదై ఉండాలి. స్థానికంగా సేకరించిన విత్తనం మొలకెత్తే అవకాశాలను పెంచుతుంది. క్రిమిరహితమైన నాణ్యమైన విత్తనాలను సేకరించాలి. వర్షాలు వచ్చే వరకూ తెగుళ్ళు, కీటకాలు లేదా ఫంగల్ దాడుల నుండి విత్తనాలను కాపాడడంపైనే కార్యక్రమ విజయం కూడా ఆధారపడి ఉంటుంది. అలాగే విత్తనం నాటే విధానాలు, నాటే వ్యక్తుల నైపుణ్యాలు కూడా కార్యక్రమ విజయాన్ని నిర్దేశిస్తాయి. నాటేందుకు మొక్కల జాతిని నిర్ణయించుకునే సందర్భంలో నేల స్వభావ సామీప్యాలను, నేల లోతు ఇంకా వర్షపాతం గమనంలో ఉంచుకోవాలి. విత్తన సేకరణ వనసంరక్షణ సమితులకు ఉపయుక్తంగా ఉండాలి. రాష్ట్రవ్యాప్తంగా నాటేందుకు 3500 టన్నుల విత్తనాలు అవసరమని, అలాగే ఏరియల్ సీడింగ్ కోసం మరో 3500 టన్నుల విత్తనం కావాలని అంచనా వేయడమైనది. డివిజనల్ అటవీశాఖాధికారులు ఈ విత్తన సేకరణ బాధ్యత వహించాలి. ఈ బాధ్యతను వనసంరక్షణ సమితులకు అప్పగించి మహాత్మాగాంధీ జాతీయ గ్రామీణ ఉపాధిహామీ పథకం ద్వారా వేతనాలు చెల్లించాలి. ఒక్కో వనసంరక్షణ సమితికి 50 హెక్టార్ల భూమిని కేటాయించి స్థానికంగా ఉపయుక్తమైన జాతుల విత్తనాలు పది కిలోల వంతున నాటించాలి. నాణ్యమైన విత్తనాల సేకరణకు, నాటడానికి సంబంధించి వనసం రక్షణ సమితులకు అటవీశాఖ అధికారులు తగిన శిక్షణ ఇప్పించాలి. విత్తనాలు నాటే పని సరైన పద్ధతిలో జరిగితే విత్తనాలు వృథా కావు. విత్తనాలు సక్రమంగా నాటడం విషయంలో ఎఫ్‌బిఓలు, ఎఫ్ఎస్ఓలు బాధ్యత వహించాలి.

# జూన్ 5న ప్రపంచ పర్యావరణ దినోత్సవం

మెదటిపేజీ తరువాయి ...
ఉద్దేశించిన కార్యక్రమాలను, విశేషంగా పర్యావరణ పరిరక్షణపై అవగాహన కార్యక్రమాలను నిర్వహించాలని నిర్ణయించారు. వన్యప్రాణుల మనుగడకు, వాటి ఆవాసాలకు ముప్పు గా పరిణమించడమే కాకుండా జలచరాలకు ప్రమాదకరంగా, మానవ ఆరోగ్యానికి సవాలుగా ప్లాస్టిక్ కాలుష్యం, ప్లాస్టిక్ వ్యర్థాలు మారాయి. వీటిని అటవీ రక్షిత ప్రాంతాలలో పూర్తిస్థాయిలో నిర్మూలించాల్సిన, అరికట్టవలసిన ఆవశ్యకత ఉంది. వీటిని ప్లాస్టిక్, పాలిథిన్ ఫ్రీ జోన్లుగా మార్చడం కోసం పూర్తిస్థాయి చర్యలు తీసుకొని పర్యాటకులు, సందర్శకులు వాటిని వాడకుండా నిషేధించాల్సిన అవసరాన్ని ఈ కార్యక్రమంలో నొక్కిచెప్పారు. దీనిపై సదవగాహన, చైతన్యం కల్పించే కార్యక్రమాలు, ప్రదర్శనలను నిర్వహించాలని సూచించారు.

# జీవ వైవిధ్యమే మానవుల ఆస్తి






ఏ దేశ భవిష్యత్తు అయినా ప్రజలకు ఆహారాన్ని అందించే సామర్థ్యం మీద ఆధారపడి ఉంటుంది. అంటే ఆ దేశపు నేల ఆరోగ్యంపైన అన్నమాట. నేల కోట్లాది మొక్కలకు, జంతువులకు ఆవాసం. ఇవి తిరిగి మనిషి ఉనికికి భద్రత కల్పిస్తాయి. కనుక నేల ఒక వనరుగా జీవావరణ, ఆర్థిక, సామాజిక విలువలను కలిగి ఉంటుంది. మనదేశంలో నేల చాలా గొప్పది. ఇప్పటికంటే రెట్టింపు జనాభాను కూడా మన దేశంలోని నేల పోషించగలదని (పంటల ద్వారా) శాస్త్రవేత్తలు అంటున్నారు. అయితే అది నేలలను సరిగా నిర్వహించినపుడు మాత్రమే! కానీ ఇప్పుడు నిర్వహణ బాగోలేదు. దీంతో దేశంలో 25 మిలియన్ల హెక్టార్ల మేర నేల పూర్తిగా క్షీణింది. పెద్దఎత్తున నేల కోత జరగడం, చవుడు నేలలుగా మారడం, రసాయన ఎరువులు, పురుగుమందులను మోతాదుకు మించి ఎక్కువగా వాడడం ఇందుకు కారణాలు. దేశంలోని కొన్ని ప్రాంతాల్లో వందల హెక్టార్ల ప్రాంతంలోని సారవంతమైన పైమట్టి కొట్టుకుపోతోంది. నత్రజని, భాస్వరం, పొటాషియం వంటి విలువైన పోషకాలు పైమట్టితో పాటు ఏటా కొట్టుకుపోతున్నాయి. నేలకోతకు ఎన్నో కారణాలు ఉన్నప్పటికీ అడవులు క్షీణించిపోవడమే ప్రధానమైన కారణం. మనదేశంలో పెద్ద ఎత్తున మొక్కలు పెంచే, అడవులను రక్షించే పథకాలను ప్రవేశపెట్టారు. ఈ ప్రయత్నాలనుంచి కొన్ని ఫలితాలు రావడంతో పచ్చదనం మన దేశంలో పెరగడం మొదలైంది. తరిగిపోయిన అడవులకు మళ్లీ జీవంపోసే ప్రయత్నాలు సఫలమవుతున్నాయి. అయితే ఈ కృషి పరిస్థితి విసురుతున్న సవాళ్ళకు చాలదు. మిలియన్న సంఖ్యలో మొక్కలు, జంతు జాతులు ఈ నేలమీద ఉన్నాయి. మళ్లీ ఒక్కో జాతిలోనే ఎంతో వైవిధ్యం ఉంది. ఈ వైవిధ్యమే మనందరికీ గొప్ప ఆస్తి. మన ఉనికి కి ఈ జీవ వైవిధ్యమే ఆధారం. మనకు ఉపయోగపడే కొత్త రకాల మొక్కలు, జంతువులను పెంచడం పెరుగుతు న్న ఈ పరిస్థితిల్లో ప్రకృతి మనకిచ్చిన జన్యు నిధిని కాపాడుకోవడం మన కర్తవ్యం. నేలమీద జరిగే జీవావరణ ప్రక్రియలు అన్నింటికి చెట్ల మద్దతు ఉంటుంది. ఆరోగ్య వంతమైన వృక్ష సమూహం పూర్తిగా క్షీణించిన ఆవరణ వ్యవస్థను సైతం పునరుజ్జీవించేలా చేయగలదు. అడవులు భూగర్భ నీటి మట్టాన్ని రీచార్జి చేస్తాయి. వరదలు, భారీ వర్షాల సమయంలో నేల కోతను అరికడతాయి. తుపానుల్లో గాలి తాకిడిని తగ్గిస్తాయి. కర్బనాన్ని పీల్చుకుని వాతావరణంలో కాలుష్యాన్ని తగ్గిస్తాయి. భారత ఉపఖండం వైవిధ్యమైన జీవావరణ ప్రాంతాలతో వైవిధ్యమైన జీవులకు నిలయంగా ఉంది. మనదేశంలో 15వేల మొక్క జాతులను, 75వేల జంతు జాతులను ఇప్పటివరకు గుర్తించడం జరిగింది. ప్రపంచం మొత్తంమీద ఉన్న నేలలో మనదేశం రెండు శాతాన్ని మాత్రమే ఆక్రమించినప్పటికీ, ఈ భూమి మీద వున్న జీవజాతుల్లో అయిదు శాతానికి ఆశ్రయం కల్పిస్తోంది. సుసంపన్నమైన జీవవైవిధ్యం ఆర్థిక వ్యవస్థకు ఎంతో ఆసరా ఇస్తుంది. దురదృష్టవశాత్తు మానవ కార్యకలాపాలవల్ల ఈ సంపదను పోగొట్టుకుంటున్నాం. ఎన్నో మొక్కల జాతులు పూర్తిగా అంతరించిపోతున్నాయి. వాటి విలువ మనకు తెలియకముందే అవి అంతరించిపోతున్న దుస్థితి ఉంది. వేటాడడంవల్ల, వన్య ప్రాణుల ఉత్పత్తులకు వున్న డిమాండ్ వల్ల వన్యప్రాణులు ప్రమాదంలో చిక్కుకున్నాయి. ఆవాసాలు కోల్పోవడంవల్ల, తడినేలలు కనుమరుగు కావడంవలన మన దేశంలో పక్షి జాతుల సంఖ్య కూడా తగ్గిపోతోంది. ఇవన్నీ భూమిపై మానవజీవనానికి మోగుతున్న ప్రమాద ఘంటికలు అనే వాస్తవాన్ని మనం గుర్తించాలి. సర్వజీవజాలమూ క్షేమంగా ఉన్నపుడే భూమిపై మానవుడూ సుఖంగా జీవిస్తాడు.

**జీవ వైవిధ్యాన్ని రక్షించుకుందాం..**
**భూమిపై జీవాన్ని కాపాడుకుందాం..**

జె.ఎస్.ఎన్. మూర్తి

**(జె.ఎస్.ఎన్. మూర్తి, IFS)**
**ముఖ్య అటవీ సంరక్షణాధికారి, రాజమండ్రి**
**చీఫ్ ఎడిటర్- వనసంరక్షిణి**

# సీతాకోకచిలుకల ప్రపంచం




ఆంధ్రప్రదేశ్ అటవీ శాఖ వన్యప్రాణి సంరక్షణ విభాగం (రాజమహేంద్రవరం), బటర్ ఫ్లై రీసెర్చ్ ఇనిస్టిట్యూట్ (భీమ్ తాల్, ఉత్తరా ఖండ్) సంయుక్తంగా గత మార్చిలో మూడు రోజుల పాటు పాపికొండ జాతీయవనం (నేషనల్ పార్క్) లో బటర్ ఫ్లై మీట్ -2018 నిర్వహించారు. సీతాకోకచిలుకలకు సంబంధించి ఇటువంటి వర్క్ షాపు ఆంధ్రప్రదేశ్‌లో ఇదే తొలిసారి. సీతాకోకచిలుకలు, తూనీగలు, చిమ్మటల పరిశోధకు లు, పరిశీలకులతో ఈ వర్క్ షాప్ వివిధ కీలకాంశాలు చర్చించింది. ప్రసిద్ధ కీటక పరిశోధకుడు, బటర్ ఫ్లై రీసెర్చ్ సెంటర్ (ఉత్తరాఖండ్) వ్యవస్థాపకుడు పీటర్ స్మెటాసెక్ ముఖ్య రిసోర్స్ పర్సన్‌గా వ్యవహరించారు. పరిశోధకులు, అటవీశాఖ సిబ్బందితో పాపికొండ నేషనల్ పార్క్, కోరింగ అభయారణ్య ప్రాంతాల్లో క్షేత్ర స్థాయి పరిశీలన జరిగింది. జూలాజికల్ సర్వే ఆఫ్ ఇండియా పూర్వ సంచాలకులు డాక్టర్ జె ఆర్ బి ఆల్ఫ్రెడ్ భారతదేశంలో 1318 జాతుల సీతాకోకచిలుకలు ఉన్నాయని తెలిపారు. వైల్డ్ లైఫ్ డిఎఫ్ఓ శ్రీ అనంత్ శంకర్ మాట్లాడుతూ అరవై రకాల సీతాకోకచిలుకల్ని, 32 జాతుల మాత్ (చిమ్మట)లను ఫీల్డ్ విజిట్‌లో గుర్తించామని తెలిపారు. హిమాలయాల్లో సంచరించే ఒక జాతి మాత్ ఇక్కడ తొలిసారి కనిపించిందన్నారు. కోరింగ బయోడైవర్సిటీ సెంటర్లో జరిగిన వర్క్ షాప్ ముగింపు సభలో రాజమండ్రి సర్కిల్ సిసిఎఫ్, ఇగీ ఫౌండేషన్ సిఈఓ శ్రీ జె ఎస్ ఎన్ మూర్తి , డిఎఫ్ఓ లు శ్రీ అనంత్ శంకర్, శ్రీమతి నందని సలారియా తదితరులు పాల్గొన్నారు. మారేడుమిల్లిలో మూడు కొత్త జాతుల సీతాకోకచిలుకల్ని ఈ పరిశీలనలో గుర్తించారు. వాటి వివరాలు ఇలా ఉన్నాయి.

1. తమిళ్ ట్రీ బ్రౌన్ (Lethe drypetes): ఇది ఆంధ్రప్రదేశ్‌లో కనిపించడం తొలిసారి. లోగడ చత్తీస్ఘడ్, తమిళనాడు, ఒడిశాల్లో గుర్తించారు.
2. నిగ్గర్ (Orsotriaena medus) : ఆంధ్రప్రదేశ్‌లో కనిపించడం తొలిసారి. ఆసక్తికర సమాచారం ఇది హిమాలయాల్లో తిరిగే ఉపజాతి.
3. చాకొలేట్ ఆల్బట్రాస్ (Appias lyncida): మొత్తం తూర్పు కనుమల్లో ఇప్పుడే కనిపించింది. హిమాలయాల్లో సంచరించే ఉపజాతి. గతంలో హిమాలయాలు, పశ్చిమ కనుమలు, నేపాల్, ఆగ్నేయాసియా తదితర చోట్ల కనిపించింది.

Papilionidae, Lycaenidae, Pieridae, Hesperiidae, Nymphalidae కుటుంబాలు లేదా ప్రజాతు లకు చెందిన సీతాకోకచిలుకలను ఈ పరిశీలనలో రికార్డు చేశారు. వీటిలో కామన్ రోజ్, లైమ్ బటర్‌ఫ్లై, స్పాట్ స్వోర్డ్‌టైల్, కామన్ మైమ్, ట్రైనీ గ్రాస్ బ్లూ, జీబ్రా బ్లూ, కామన్ పీరాట్, స్మాల్ గ్రాస్ ఎల్లో, కామన్ గ్రాస్ ఎల్లో, త్రీస్పాట్ గ్రాస్ ఎల్లో, కామన్ వాండరర్, చెస్ట్‌నట్ బాబ్, స్నో ఫ్లాట్, స్ట్రైప్డ్ బ్లూ క్రౌ, బ్రౌన్ కింగ్ క్రౌ, కామన్ క్రౌ, ప్లెయిన్ టైగర్, లెమన్ పాన్సీ, చాకొలేట్ పాన్సీ, గ్రేట్ ఎగ్ ఫ్లై, ప్లెయిన్ రాజా, బ్లాక్ రాజా, స్ట్రైప్డ్ టైగర్ తదితర సీతాకోకచిలుకలు ఉన్నాయి. ఇక తూనీగలు ఇతరాలకు సంబంధించి గుర్తిం చిన వాటిలో ట్రంపెట్ టైల్, గ్రౌండ్ స్కిమ్మర్, ఆసియాటిక్ బ్లడ్ టైల్, బ్రౌన్ బాక్డ్ రెడ్ మార్ష్ బ్లూమార్ష్ హాక్, వాండరింగ్ గ్లయిడర్, క్రిమ్సన్ మార్ష్ గ్లయిడర్, లాంగ్ లెగ్డ్ మార్ష్ గ్లయిడర్, గ్రీన్ మార్ష్ హాక్, స్ట్రీమ్ గ్లోరీ, కూర్గ్ బాంబూటైల్, స్ట్రీమ్ రుబీ ఉన్నాయి.



# తీవ్ర ముప్పులో బట్టమేక పక్షులు

కె. మృత్యుంజయరావు
Former Honourary Wildlife Warden



పక్షి ప్రపంచం

బట్టమేక పక్షి బస్టర్డ్ పక్షులలో ఒకటి. దీనిని ఇంగ్లీషులో గ్రేట్ ఇండియన్ బస్టర్డ్ అని పిలుస్తారు. జిఐబి అని కూడా అంటారు. దీని శాస్త్రీయ నామం ఆర్టియోటిస్ నిగ్రిసెప్స్. ప్రపంచంలో ఇవి 22 జాతులు ఉండగా భారతదేశంలో ఐదు జాతులు ఉన్నాయి.

1. బట్టమేక పక్షి : గ్రేట్ ఇండియన్ బస్టర్డ్
2. నేలనెమలి : సైఫియోటిడిస్ ఇండికా
3. బెంగాల్ ఫ్లోరికన్ : హెబోరోప్సిస్ బెంగాలెన్సిస్
4. హెుబారా బస్టర్డ్ : ఛ్లామైడ్లోటిస్ అన్‌డ్యులాటా
5. లిటిల్ బస్టర్డ్ : టెట్రాక్స్ టెట్రాక్స్

వైవాటిలో మొదటి మూడు పక్షులు ఇండియాలో కనిపిస్తాయి. నాలుగు, ఐదు జాతులు వలస వస్తాయి.

బట్టమేక పక్షి : పరిమాణము : ఇది 92-122 సెంటీ మీటర్లు పరిమాణము కలిగి ఉంటుంది. నెమలి (తోక లేకుండా) సైజులో ఉంటుంది. ఇది గోధుమ, తెలుపు రంగులు గల పక్షి. పై భాగము గోధుమ రంగులోను, మెడ కింది భాగం తెలుపు రంగులోను ఉండి తల పై భాగం నల్లగా ఉంటుంది. తలపై కనీ కనబడనట్లుగా చిన్న కుచ్చు ఉంటుంది. మగపక్షి ఆడపక్షి ఒకేలా ఉంటాయి కానీ మగది కొంచెం పెద్దదిగా ఉండి ఛాతీపై నల్లని పట్టీ ఉంటుంది.

సంచరించే ప్రదేశాలు మరియు స్థాయి : ఇవి పచ్చికబయళ్ళు, మధ్య మధ్య తుప్పలు కలిగిన మైదానాలు, మెట్ట పంటలు కలిగిన మైదానాలు, మెట్ట పంటలున్న గడ్డి మైదానాలు, ఎడారి లక్షణాలు గల మైదానాల్లో నివసిస్తుంది. ఈ చెప్పబడిన ప్రదేశాల్లో ఇంచుమించు భారతదేశమంతా (ఈశాన్య భారతం తప్ప), పాకిస్థాన్‌లో ఎక్కువగా ఇవి సంచరించేవి.

ఆహారం : మిడతలు, పురుగులు ముఖ్యంగా మైలబ్రిస్ జాతి పురుగులు, గింజలు, మొక్కల చిగుర్లు, రేగి కంపల పళ్ళు, పువ్వులు, కొర్రలు, వేరుశెనగ పొలంలోని పురుగులు, బయటకు వచ్చిన వేరుశెనగను తింటాయి. చనగలు, మిల్లెట్లు, బజ్రాలను తింటాయి. బల్లులు, జెర్రులు, చిన్న సరీసృపాలను తింటాయి.

అలవాట్లు : మానవులకు దూరంగా వెళ్ళిపోతూ ఉంటుంది. ముఖ్యంగా సంతానోత్పత్తి కాలంలో, గుడ్లు పొదిగేటపుడు చాలా జాగ్రత్తగా ఉంటుంది. ఇవి సాధారణంగా రెండు, మూడు లేదా అంతకు మించి చిన్నచిన్న గుంపులుగా ఉంటాయి. అరుదుగా 20 నుంచి 25 పక్షుల వరకూ కూడా గుంపుగా ఉంటాయి. ఇది నేలపై సంచరించే పక్షి, చెట్లపై ఉండదు. నేలపై సంచరించేది అయినా కూడా బాగా ఎగురగలదు. గాలిలోకి మొదట బరువుగా లేస్తుంది. లేచిన తరువాత రెక్కలను క్రమబద్ధంగా కొట్టుకుంటూ ఎగురుతుంది. ఆట్టే ఎత్తుకి ఎగరలేనప్పటికీ అనేక కిలోమీటర్ల దూరం ఆగకుండా ఎగరగలదు. బరువైన ఎగిరే పక్షుల్లో ఇది కూడా ఒకటి. కృష్ణజింకలు తిరుగాడే ప్రాంతంలో వాటితో కలసి బట్టమేక పక్షులు నివసిస్తాయి. ఈ రెంటి ఆవాసాలు ఒక్కటే. బట్టమేక పక్షులు అభయారణ్యానికే పరిమితం కావు. చుట్టుపక్కల గ్రామాల్లో, పంటపొలాల్లో ఆహారం కోసం సంచరిస్తూ ఉంటాయి. ఇవి దేశద్రిమ్మరిజాతి. అభయారణ్యానికి దూరంలో ఉన్న ప్రాంతాలలో కూడా సంచరిస్తాయి.

సంతానోత్పత్తి : మగపక్షి బహుభార్యాత్వము కలది. ప్రతి మొగ పక్షికి నాలుగైదు ఆడ పక్షులుంటాయి. ఇది గర్వంగా, ఠీవిగా అడుగులు వేస్తూ ఆడపక్షులతో కలసి సంచరిస్తుంది. సంతానోత్పత్తి కాలంలో సొగసు ప్రదర్శిస్తూ. గెడ్డము, మెడ దగ్గర ఉన్న మెత్తటి ఈకల కుచ్చును వ్యాపింపజేస్తూ తోకను పైకి ఎత్తి తదనుగుణంగా ఒక విధమైన శబ్దం చేస్తూ ఆడపక్షులను ఆకర్షించే విన్యాసాలు చేస్తూ ఉంటుంది. దీని గూడు పొదవాటి గడ్డి మధ్యగాని, పొదల కింద గాని, మదుగు చేసుకొని నేలపైనే పల్లముగా చేసి ఒక గుడ్డు పెడుతుంది. వీటి సంతానోత్పత్తి వర్షాకాలం ఆరంభంలో కానీ, శీతాకాలంలో గాని ఉంటుంది. అప్పుడప్పుడు మార్చి నుంచి ఆగస్టు వరకు, ఆగస్టు నుంచి డిసెంబర్ వరకూ ఉంటుంది.

ప్రస్తుత పరిస్థితి : 1980 వరకూ 1500 - 2000 వరకూ ఉండే ఈ బట్టమేక పక్షులు 2011 సంవత్సరం నాటికి 250కి తగ్గిపోయాయి. ప్రస్తుతం వీటి పరిస్థితి చాలా ప్రమాదంలో ఉంది. 100-150 వరకూ మాత్రమే ఇవి ఉంటాయని భావిస్తున్నారు. ఇదివరకు కనిపించిన ప్రాంతాల్లో వీటి ఉనికి ఇప్పుడు 90 శాతం పైగా అంతరించిపోయింది. 3 అభయారణ్యాలనుంచి పూర్తిగా కనుమరుగైనాయి. కొన్ని అభయారణ్యాలలో ఉన్నాయా లేవా అనే పరిస్థితి ఉంది. రాజస్థాన్‌లో పరిస్థితి కాస్త మెరుగు. అక్కడి డిజర్ట్ నేషనల్ పార్కులో ఈ పక్షులు 31 వరకూ ఉన్నాయి. 2017 గణాంకాల ప్రకారం ఈ పార్కులో వీటి సంఖ్య పెరిగిందని చెబుతున్నారు. మొత్తం రాజస్థాన్‌లో 2015 లో మొత్తం 40 బట్టమేక పక్షులు (భరద్వాజ) ఉన్నాయని అంచనా. అయితే 2012లో 89 ఉండేవి. వీటి సంఖ్యాపరంగా రాజస్థాన్ తర్వాత గుజరాత్, మహారాష్ట్ర, ఆంధ్రప్రదేశ్, కర్ణాటక ఉన్నాయి. ప్రస్తుతం ఆంధ్రప్రదేశ్, కర్ణాటకల్లో వీటి ఉనికి అరుదుగా మారింది. గతంలో నివసించిన హర్యానా, పంజాబ్, ఉత్తరప్రదేశ్, మధ్యప్ర దేశ్, బరిస్తాలనుంచి పూర్తిగా కనుమరుగై పోయాయి. పాకిస్థాన్ లోనూ ఇదే పరిస్థితి. అక్కడి సంతానోత్పత్తి వివరాలు తెలియడంలేదు.

కారణాలు : గడ్డి మైదానాలు, ఆవాసప్రదేశాలు నశించిపోవడం. ఆక్రమణలు, మెట్ట పంటల మార్పిడి, మాగాణి పంటలుగా మారడం. గనులు, క్వారీలు, కృత్రిమ వర్షాలు, పట్టణీకరణ, హరితవనాల పేరుతో గడ్డి మైదానాల్లో చెట్లు నాటడం, జలసంరక్షణ పనుల్లో భాగంగా ట్రెంచులు తవ్వడం, వాటర్‌షెడ్ పనుల ఫలితంగా వీటి ఆవాసాల రూపురేఖలు మారిపోయి ఉనికిని కోల్పోయాయి. గడ్డి భూముల్ని పనికిరాని భూములుగా భావించడం జరుగుతున్నది తప్ప వాటిపై ఆధారపడే జీవాలు ఉంటాయని గుర్తించలేదు. భారతదేశపు జాతీయ పక్షిని ఎంపిక చేసేటపుడు నెమలితో పాటు బట్టమేకను కూడా పరిశీలించారు.

## ఆర్కిటిక్... ప్లాస్టిక్ సముద్రం

సముద్రంలో ప్లాస్టిక్ కాదు.. సముద్రమే ప్లాస్టిక్‌గా మారిపోతున్న సన్నివేశం ఇది. తాజాగా ఆర్కిటిక్ సముద్రంలో శాస్త్రవేత్తలు లీటర్ నీటిలో 12000 సూక్ష్మ ప్లాస్టిక్ కణాల ఉనికిని కనుగొని కంగుతిన్నారు. గత పరిశోధనలో కనిపించిన ప్లాస్టిక్ కణాలకంటే ఈసారి మూడురెట్లు ఎక్కువ ప్లాస్టిక్ కనిపించింది. మొత్తం 17 రకాల ప్లాస్టిక్స్ ఉనికి గుర్తించారు. ప్యాకేజింగ్ మెటీరియల్స్, నైలాన్, సిగరెట్ ఫిల్టర్స్, రంగులు వంటి వాటి అవశేషాలు వీటిలో ఉన్నాయి. ఇది సముద్రంలోని జీవుల మనుగడకు ముప్పని, తీరంలోని మానవుల ఆరోగ్యంపై దుష్ప్రభావం తప్పదని శాస్త్రవేత్తలు ఆందోళన చెందుతున్నారు. దాదాపు ఒక టన్ను ప్లాస్టిక్ ఆర్కిటిక్ సముద్రంలో దశాబ్దాలుగా ఘనీభవించిపోయిందనే విషయాన్ని గత పరిశోధనలు తేటతెల్లం చేశాయి. మానవులు 8.3 బిలియన్ మెట్రిక్ న్నుల ప్లాస్టిక్‌ను సృష్టిస్తే... అందులో పదిశాతం మాత్రమే రీసైక్లింగ్‌కు వీలవుతుంది. మిగిలినది వ్యర్థంగానే ఉండిపోతుంది.



# రోళ్ళపాడు అభయారణ్యం



## బట్టమేక పక్షుల సంరక్షణ – పరిస్థితి

ఇది 6.14 చదరపు కిలోమీటర్ల వైశాల్యంలో విస్తరించి ఉంది. భారతదేశపు అభయారణ్యాలలో ఇది అతిచిన్నది. వైశాల్యంలో ఇది చిన్నదైనప్పటికీ బటట్టమేక పక్షుల (Great Indian bustard) సాంద్రత (Density of Bustard) అన్ని అభయారణ్యాలకంటే ఇక్కడ ఎక్కువ. ఈ ప్రాంతాన్ని అభయారణ్యంగా గుర్తించిన మొదట్లో ఇక్కడ 70 వరకూ బట్టమేక పక్షులు ఉండేవి. ఆ సమయంలో ఒకేరోజులో ఇక్కడ 38 బట్టమేక పక్షులు కనిపించడాన్ని బట్టి ఈ అభయారణ్య ప్రాముఖ్యత అర్థమవుతుంది. అటువంటిది రానురాను ఈ పక్షుల సంఖ్య తగ్గిపోయి అభయారణ్యం ఉనికికి తీవ్ర ప్రమాదం ఏర్పడింది. బట్టమేక పక్షుల ఉనికి పరంగా రెండు మూడు సంవత్సరాలనుంచి పరిస్థితి మరింత విషమించింది. రెండు మూడు పక్షులు కనిపించడమే అరుదుగా మారింది. రానురాను ఒకే పక్షి కనిపించడం మొదలైంది. ఇది కూడా క్రమబద్ధంగా లేదు. అయితే గుడ్లు పెట్టడం జరుగుతోంది కానీ పిల్లలయ్యేవి కావు. కారణం తెలియ రావడంలేదు. పొదుగుచున్నపుడు ఏవైనా అంతరాయాలు కలుగుతున్నాయా, రసాయనిక ఎరువులు, క్రిమిసంహారకాల ప్రభావం గుడ్డుపై పడుతున్నదా లేక జీవంలేని గుడ్డా.. ఇతరత్రా కారణాలు ఏవైనా ఉన్నాయా? ఇవన్నీ చర్చనీయ, పరిశీలనీయ అంశాలు.

రోళ్ళపాడు ఒక్క బట్టమేక పక్షులకే కాదు బట్టమేక పక్షుల జాతికే చెందిన లెస్సర్ ఫ్లోరికాన్ కూడా ఇక్కడ నివసిస్తుంది. శీతాకాలంలో వలస వచ్చే గద్ద జాతి పక్షులకు కూడా ఇదొక ముఖ్య కేంద్రము. ప్రస్తుతం వీటి పరిస్థితి కూడా బట్టమేక పక్షుల మాదిరిగానే తయారైంది. ఒకప్పుడు వెయ్యికి పైగా వచ్చే గద్ద జాతి పక్షులు ఇపుడు బాగా తగ్గిపోయాయి. వంద రావడం కూడా కష్టంగా మారింది. ఈ అభయారణ్యంలో కృష్ణజింకలు ఎక్కువగా ఉన్నాయి. బట్టమేకలు, గద్దజాతులు కనుమరుగయ్యే పరిస్థితిలో ఉంటే కృష్ణజింకలు లెక్కకు మించి పెరిగిపోయి అభయారణ్య ఉనికికే ప్రమాదకరంగా తయారయ్యాయి.

మార్చిలో ఈ అభయారణ్యంలో బట్టమేక పక్షి గుడ్డు పెట్టడం జరిగింది. బట్టమేక పక్షుల సంరక్షణకు కొన్ని చర్యలు తప్పక తీసుకోవాలి. ముఖ్యంగా అభయారణ్యం లోనికి (బట్టమేక పక్షుల ఆవాస ప్రాంతం లోనికి) ఎవరినీ అనుమతించకూడదు. అది సంచరించే ప్రదేశానికి 400 మీటర్ల దూరంలో గానీ లేదా పక్షి కలత చెందనటువంటి దూరంలో గాని పరిసరాల్లో కలిసిపోయే కంచెను నిర్మించాలి. 20x80 సైజు గల లేదా అనుకూలమైన బైనాక్యులర్ లేదా స్పాటోస్కోప్ ఉపయోగించి పక్షి గుడ్డును పొదుగుతున్నంత కాలమూ పరిశీలించి ఎప్పటికప్పుడు వివరాలు నమోదు చేసుకోవాలి. బట్టమేక సంరక్షణ చర్యల్లో భాగంగా జిల్లాలోని గడ్డి మైదానాలు, మెట్ట భూములను అటవీశాఖకు అప్పగించాలి. బట్టమేక పక్షుల సంరక్షణ అత్యంత క్లిష్టతరమైనప్పటికీ ఆ పక్షి జాతి రక్షణకు పటిష్ట చర్యలు తీసుకోబడాలని, అవి రక్షింపబడాలని ఆశిద్దాం.

**కె. మృత్యుంజయరావు**
Former Honourary WIldlife Warden

## అడవి బంగారు తల్లి (గేయం)



రచన : ఎస్. రాజ్‌కుమార్
స్ట్రైకింగ్ ఫోర్స్ (పిడబ్ల్యు)
ఫారెస్ట్ రేంజ్ ఆఫీస్,
రాయచోటి

అడవి బంగారు తల్లి
ఓరన్నా మా కూలన్నా
ఈ అడవిని చూడన్న
అడవికి హాని చేయొద్దన్న
తల్లిని మరచిపోవద్దన్న ॥అడవి॥
పసిడి గాలులనిచ్చే పచ్చనీ తల్లీ
ప్రాణవాయువునిచ్చే అడవీ తల్లీ
వనాలు, వన్యమృగాలు అన్నిటికీ
ఆశ్రమమై నిలిచే అడవీ తల్లీ
సెలయేరుల నీరు, కోయిల రాగాలు
ఝుమ్మని తుమ్మెదలు,
మన అడవి అందాలు ॥అ॥
వనసంరక్షనే మనరక్షణ అని
చెట్లు బాగుంటేనే వానలొస్తాయనీ
కూలికాశపడి చెట్లు కూలిస్తే
కూలిపోయే భవిత మనదేనని
అందరూ తెలుసుకోవాలి..
అందరూ కలసిరావాలి
సిరులిచ్చే తల్లీ మన కలప్పవల్లీ
బంగారు తల్లీ నా అడవి తల్లీ ॥అడవి॥
వన్యప్రాణి సంరక్షణ జరగాలంటే
పర్యావరణ పరిరక్షణ కావాలంటే
అరణ్యాలు సౌభాగ్యంగా విలసిల్లాలి
పరిసరాలన్నీ పచ్చదనంతో నిండాలి
మధుర తేనెలు, నోరూరు పండ్లు
ఎగిరి దుముకు జలపాతాల హోరు
ఈ అడవి బాట యందు
అణువణువు కనువిందు

# అరుదైన నల్లచిరుత



**సుందర్‌గఢ్ అడవుల్లో కెమెరా ట్రాప్స్‌కి చిక్కింది**

**2015లోనే డొంకరాయి వద్ద సంచరించిన సమాచారం**

ఒడిశాలోని సుందర్‌గఢ్ అడవిలో ఎన్నడూలేనిది తొలిసారి నల్లచిరుత (బ్లాక్ పాంథర్) కనిపించింది. అడవిలో నల్లచిరుత సంచరిస్తుండగా కెమెరాలో రికార్డు అయిందని సుందర్‌గఢ్ ఫారెస్ట్ చీఫ్ కన్జర్వేటర్ హెచ్‌కే బిస్త్ మీడియాకు తెలిపారు. సుందర్‌గఢ్ ఫారెస్ట్ డివిజన్‌లోని గర్జన్‌పహడ్ రిజర్వ్ ఫారెస్ట్‌లో ఏర్పాటుచేసిన కెమెరాల్లో నల్లచిరుత సంచరిస్తున్న దృశ్యాలు నమోదయ్యాయని ఒడిశా అటవీశాఖ ధ్రువీకరించింది. నల్లచిరుత కనిపించిన తొమ్మిదవ రాష్ట్రం ఒడిశా. మెలనిస్టిక్ లియోపార్డ్స్‌గా పిలిచే ఈ బ్లాక్ పాంథర్స్ ఇప్పటివరకు కేరళ, కర్ణాటక, ఛత్తీస్‌గఢ్, మహారాష్ట్ర, గోవా, తమిళనాడు, అస్సోం, అరుణాచల్ ప్రదేశ్ రాష్ట్రాల్లోని అడవుల్లో మాత్రమే ఇవి కనిపించాయి. 22 ఏళ్ల కిందట ఒడిశాలోని ఫూల్‌బనీ, సిమ్లీపాల్ అడవుల్లో నల్లచిరుతలు కనిపించినట్టు చెప్తారు. అయితే, అప్పుడు కెమెరాలు లేకపోవడంతో వీటి ఉనికి నిర్ధారించలేదు. ఈ విషయమే ఇక్కడ గమనార్హం. ఆంధ్రప్రదేశ్ అటవీ ప్రాంతానికి వివిధ రాష్ట్రాల అడవులు సరిహద్దుగా ఉన్నాయి. వీటిలో ఒరిస్సా కూడా ఒకటి. కాగా వైల్డ్‌లైఫ్ రేంజ్ అధికారిగా 2014-15 ప్రాంతంలో డొంకరాయి ఏరియాలో పనిచేసిన కుమార్ (ప్రస్తుతం ఫ్లయింగ్ స్క్వాడ్, రాజమండ్రి) మాట్లాడుతూ.. 2015లో డొంకరాయి ఏరియాలో నల్లచిరుత సంచారం గురించి సమాచారం తమకు తెలిసిందన్నారు. వెటర్నరీ అధికారి డాక్టర్ ఫణీంద్ర తదితరులు తమకు శబరి నది వద్ద నల్లచిరుత తిరుగుతున్నదని చెప్పారన్నారు. అయితే అప్పట్లో నల్ల చిరుత గురించి ఏమీ తెలియని తాము పెద్దగా విశ్వసించలేదని చెప్పారు. అయితే ఒరిస్సా అడవుల్లో నల్ల చిరుత కనిపించడాన్ని బట్టి అదే సరిహద్దుగా కలిగిన డొంకరాయి ఏరియాలో అది కనిపించడం కూడా వాస్తవమేననుకోవాలి.

# పొడవు మొక్కలు పర్యావరణానికి ఆభరణాలు

## ఇండోజర్మన్ ప్రాజెక్ట్ కన్సల్టెంట్ లక్ష్మీకాంతం

పొడవైన మొక్కలు (టాల్ ప్లాంట్స్) పర్యావరణానికి ఆభరణాలని, ఇవి అడవులను, మైదానప్రాంతాన్ని కూడా రక్షిస్తాయని అటవీశాఖ రిటైర్డ్ డిఎఫ్ఓ, ఇండోజర్మన్ ప్రాజెక్టు కన్సల్టెంట్ శ్రీ లక్ష్మీకాంతం అన్నారు. పొడవు మొక్కలను పెంచడానికి అనుసరించవలసిన సులువైన పద్ధతులు, మెళకువలపై అటవీ సిబ్బంది పూర్తి అవగాహన కల్పించుకోవాలని వాటి పెంపకంలో నిపుణులైన శ్రీ లక్ష్మీకాంతం సూచించారు. ఆయన ఆధ్వర్యంలో మే 8వ తేదీన రాజమహేంద్రవరంలోని అటవీశాఖ ముఖ్యసంరక్షణాధికారి కార్యాలయంలో ఒక వర్క్‌షాప్ జరిగింది. సర్కిల్ పరిధిలోని ఉభయగోదావరి, కృష్ణా జిల్లాలనుంచి రేంజ్ అధికారులు, డిఎఫ్ఓలు ఈ వర్క్‌షాప్‌లో పాల్గొన్నారు. శ్రీలక్ష్మీకాంతం మాట్లాడుతూ ఎత్తుకు ఎదిగే పొడవు మొక్కలు మూడు మీటర్లు ఎదగాలంటే సాధారణ పరిస్థితుల్లో 3 సంవత్సరాలు పడుతుందన్నారు. అయితే తాము గతంలోనే ఆచరించి విజయం సాధించిన విధానాలు పాటిస్తే పది మాసాల్లోనే మూడు మీటర్ల ఎదుగుదల సాధ్యమన్నారు. వివిధ కొండ ప్రాంతాల్లో, రహదారులు, ఖాళీ స్థలాల్లో తాము ఇలా పొడవైన మొక్కల్ని పెంచి పలు ప్లాంటేషన్లు వృద్ధి చేశామన్నారు. చిత్తూరు, నెల్లూరు, అనంతపురం తదితర జిల్లాల్లో తమ



హయాంలో అభివృద్ధి చెందిన ప్లాంటేషన్ల వివరాలను, అక్కడి పరిస్థితులను ఆయన వివరించారు. సుమారు 20 జాతుల పొడవు మొక్కలను తమ ప్లాంటేషన్లలో పెంచడం జరిగిందని తెలిపారు. ఇతర మొక్కలు లేని, ఖాళీ ప్రదేశాల్లో ప్రత్యేకంగా పొడవు మొక్కలు పెంచడం సరైన విధానమన్నారు. ప్రతి నర్సరీలో కనీసం పదివేల పొడవు మొక్కలు ఉండేలా అటవీశాఖ అధికారులు శ్రద్ధ తీసుకోవాలని సూచించారు. జూలై నెలలో నర్సరీలను మొదలుపెట్టడం మంచిదన్నారు. అక్కడి నుంచి వర్షాకాలం కాబట్టి ఆరుమాసాల్లో మొక్కలు జీవించే రేటు పెరుగుతుందన్నారు. అయితే రాష్ట్రంలో ఎక్కువగా నవంబర్‌లో నర్సరీలను ప్రారంభిస్తుండడంతో బోర్లనుంచి ఉప్పుతో కూడిన నీరువచ్చి ఎక్కువ మొక్కలు మరణిస్తున్నాయన్నారు. స్థానిక వాతావరణ పరిస్థితులను బట్టి మొక్కల జాతుల్ని ఎంపిక చేసుకోవాలని, అలాగే మొక్కలను బట్టి వాటికి తవ్వే గోతుల (పిట్) కొలతల్ని మార్చుకోవాలని చెప్పారు. అడవుల్లో పెద్ద చెట్లు ఉండడం వలన వర్షం నీరు భూగర్భంలో చేరుతుందని, పెద్ద చెట్లు లేకపోతే గడ్డి మొక్కలు పెరిగి అగ్నిప్రమాదాలకు ఆస్కారం పెరుగుతుందని వివరించారు. అడవులు, మైదాన ప్రాంతాల్లో ఉన్న కొండలను హరితంగా మార్చేందుకు చర్యలు తీసుకోవాలన్నారు. కొండవాలు వెంబడి ట్రెంచ్‌లు తవ్వి, ఆ మట్టితో గట్లు పోయాలన్నారు. ట్రెంచ్‌ల మధ్య, గట్ల వాలులో వివిధ జాతుల మొక్కలను (టాల్ ప్లాంట్స్) పెంచడం వలన తక్కువ సమయంలోనే కొండలన్నీ పచ్చదనంతో కళకళలాడతాయన్నారు. కొండలను హరితవనాలుగా తీర్చిదిద్దేటపుడు పర్యావరణ ప్రయోజనం ఆశించాలి తప్ప ఆర్థిక ప్రయోజనాలు కాదన్నారు. కనీసం నాలుగేళ్ళపాటు కొండలను పచ్చగా కాపాడగలిగితే వాటిపై కురిసిన వర్షధారలు స్వచ్ఛంగా వాగుల్లోకి ప్రవహిస్తాయని, చుట్టుపక్కల ప్రాంతాలన్నీ పచ్చగా మారతాయని పేర్కొన్నారు. ఇండో జర్మన్ ప్రాజెక్టు స్టేట్ కోఆర్డినేటర్ సౌమిత్రి కూడా వర్క్‌షాపులో పాల్గొన్నారు. అనంతరం దివాన్‌చెరువు నగరవనంలోని సీడింగ్స్‌ను శ్రీలక్ష్మీకాంతం పరిశీలించారు. రాజమండ్రి సర్కిల్ ముఖ్య అటవీ సంరక్షణాధికారి శ్రీ జెఎస్ఎన్ మూర్తి వర్క్‌షాప్‌లో మాట్లాడుతూ వ్యవసాయ రంగంలో పంటకు అవసరమైన నీటిని అంచనావేసినట్లుగానే, టాల్ సీడ్లింగ్స్ ప్లాంటేషన్స్‌కు కూడా కచ్చితమైన నీటి వినియోగంపై అంచనాలు రూపొందాలని ఆకాంక్షించారు. కాకినాడ డిఎఫ్ఓ డాక్టర్ శ్రీమతి నందని సలారియా, డిఎఫ్ఓలు శ్రీ అనంత్‌శంకర్, శ్రీనాగేశ్వరరావు, ఎస్ఎస్ శ్రీహరిగోపాల్ తదితరులు పాల్గొన్నారు.

## హరిత గిరుల పునరుద్ధరణలో గ్రామస్తుల పాత్ర కీలకం

గ్రామాలకు అనుబంధంగా ఉన్న కొండలను తిరిగి హరిత గిరులుగా మార్చడంకోసం అటవీశాఖ యంత్రాంగం కృషి చేయాలని ఇండో జర్మన్ ప్రాజెక్ట్ ఆన్ ఎంజిఎన్ఆర్ఇజిఎ అండ్ ఎన్విరాన్మెంటల్ బెనిఫిట్స్ (జిఐజెడ్) కన్సల్టెంట్, రిటైర్డ్ అటవీ అధికారి లక్ష్మీకాంతం పిలుపునిచ్చారు. ఈ ప్రయత్నం సఫలం కావాలంటే సమీప గ్రామాల ప్రజల సహకారం, భాగస్వామ్యం ఎంతో కీలకమని చెప్పారు. లాలాచెర్వులోని ఎపి స్టేట్ ఫారెస్ట్ అకాడమీలో శిక్షణ పొందుతున్న అటవీ సెక్షన్ అధికారులు, బీట్ అధికారులను ఉద్దేశించి మే 9వ తేదీన అసెంబ్లీ హాల్లో ఆయన మాట్లాడారు. ఒకప్పుడు పచ్చదనంతో, అనేక వృక్షజాతులతో నిండి ప్రజలకు ఎంతో ఉపయోగపడిన కొండలు ఇవాళ బీడు వారిపోయి బోడిగా కనిపిస్తున్నాయన్నారు. వీటిపై చెట్లను విచక్షణ లేకుండా కొట్టివేయడం, ఆక్రమించు కొని వ్యవసాయం చేస్తుండడం, రాళ్ళు, భూమిలోపలి ఖనిజాలకోసం మైనింగ్ చేస్తుండడం వంటి కారణాల వలన కొండలపై పచ్చదనం అంతరించిందని ఆయన పేర్కొన్నారు. చెట్లు లేకపోవడం వలన కొండలపై భూమి ఎండకు ఎక్స్




పోజ్ అవుతుందని.. ఫలితంగా తేమ హరించుకుపోతుందని విశ్లేషించారు. పశుగ్రాసానికి కూడా పనికిరాని బోద గడ్డి కొండలనిండుగా వ్యాపించడంతో తరచూ అగ్నిప్రమాదాలు కూడా జరుగుతున్నాయన్నారు. ప్రభుత్వ విధానంలో భాగంగా ఇప్పుడు ప్రతి రేంజ్ పరిధిలో 30 హెక్టార్ల కొండను తిరిగి పచ్చదనంతో నింపే కృషిని ప్రణాళికాబద్ధంగా కొనసాగించాలన్నారు. కొండలపై భూమి నిస్సారం అయిపోవడం, తేమ అడుగంటడం వలన దానిని పునరుద్ధరించడం ఇప్పటికిప్పుడు సాధ్యం కాదన్నారు. కొండ వాలు వెంబడి కాంటూరు ట్రెంచ్ (కందకాలు) లు తవ్వడం, ఆ మట్టిని కందకం అంచు వెంబడి గుట్టగా పోయడం తొలిదశలో జరగాలన్నారు. దీనివలన వర్షం నీరు నిల్వ ఉండి భూమిలో తేమ శాతం పెరుగుతుందని, అలాగే మట్టి లోతు పెరుగుతుందని చెప్పారు. గట్టు వెంబడి పొడవు చెట్లను పెంచే కార్యక్రమం చేపడితే కనీసం ఒకటి రెండేళ్ళకైనా కొండపై పచ్చదనాన్ని పెంచడం సాధ్యమన్నారు. కొండలపై మొక్కలను పెంచే ప్రయోగాలకు ఆ కొండలపై ఆధారపడి ఉన్న స్థానిక ప్రజాసమూహాల సహకారం తీసుకోవాలని సూచించారు. ఇందుకోసం గ్రామస్తులతో సమావేశాలు నిర్వహించడం, ఉపాధి హామీ పథకాన్ని వర్తింపజేయడం.. వారికే కందకాల తవ్వకం, మొక్కల పెంపకం పనులు అప్పజెప్పడం వంటివి చేయాలన్నారు. ఎ పరిస్థితులనైనా తట్టుకొని జీవించే కానుగ, సీతాఫలం వంటి మొక్కలనే హరితగిరుల పునరుద్ధరణ కార్యక్రమంలో నాటేందుకు ఎంచుకోవాలన్నారు. అకాడమీ ఫ్యాకల్టీ సభ్యులు కె జోజిబాబు అధ్యక్షత వహించగా, ఇండో జర్మన్ ప్రాజెక్ట్ ఎపి కోఆర్డినేటర్ శ్రీ సౌమిత్రి, ఫ్యాకల్టీ మెంబర్స్ శ్రీ రమణ, శ్రీ రాజేంద్రప్రసాద్, ఎఫ్ఎస్ఓ శ్రీ ప్రసాద్, శ్రీ శ్యాంబాబు పాల్గొన్నారు.

## జంతు జాలం

# అతి పెద్ద జంతువు ఏనుగు

సకశేరుక వర్గానికి చెందిన క్షీరదాల తరగతికి చెందిన జంతువు ఏనుగు. ఇది ఎలిఫెంటిడే కుటుంబానికి చెందినది. భారీ శరీరం, తొండము కలిగిన జంతువు. ప్రస్తుతం భూమిపై సంచరించే జంతువులన్నింటిలోకి ఏనుగే పెద్దది. దీని గర్భావధి కాలం 22 నెలలు. ఏనుగు 70 సంవత్సరాలు కంటే ఎక్కువగా జీవిస్తుంది. ఏనుగులు రెండు రకాలు. ఆఫ్రికా ఏనుగు మరియు ఆసియా ఏనుగు. ఇవి పూర్తిగా శాకాహారులు మరియు బాగా తెలివైనవి. వీటికి జ్ఞాపకశక్తి ఎక్కువ. నిశిత దృష్టి కలిగినవి.

**ఆఫ్రికా ఏనుగు :** ఆఫ్రికా ఖండంలో 37 దేశాలలో విస్తరించి ఉన్నాయి. ఇవి ఆసియా ఏనుగులకంటే పెద్దవిగా ఉంటాయి. వీటి వెనుకభాగం పుటాకారంలో ఉంటుంది. వీటి చెవులు చాలా పెద్దవి. వీటి చెవులు ఆఫ్రికా ఖండం ఆకారంలో ఉండడం విశేషం. ఆడ, మగ ఏనుగులు రెండూ దంతాలు కలిగి ఉంటాయి.

**ఆసియా ఏనుగు :** ఆసియా ఏనుగులు ఆఫ్రికా ఏనుగుల కంటే చిన్నవి. చెవులు చిన్నవిగా ఉంటాయి. మగ ఏనుగులకు మాత్రమే పెద్ద దంతాలుంటాయి. మొత్తం ఏనుగులలో 10 శాతం మాత్రమే ఆసియా ఏనుగులు. ఆసియా ఏనుగులను జన్యు వ్యత్యాసాల ఆధారంగా మూడు ఉపజాతులుగా విభజించారు.

**శ్రీలంక ఏనుగు :** ఆసియా ఏనుగులన్నింటిలోను పెద్దది. ఇవి శ్రీలంకలో మాత్రమే ఉన్నాయి. ఇవి ఇంచుమించు 3,000–4,500 వరకు ఉన్నాయని అంచనా. ఇవి సుమారు 5,400 కి.గ్రా. బరువు, 3.4 మీ. ఎత్తు ఉంటాయి.

**భారతదేశపు ఏనుగు :** ఆసియా ఏనుగులన్నింటిలో సంఖ్యలో ఎక్కువగా, అంటే 36,000 వరకు ఉన్నాయని అంచనా. ఇవి భారతదేశం నుండి ఇండోనేషియా వరకు విస్తరించి ఉన్నాయి. ఇవి ఇంచుమించు 5,000 కి.గ్రా. బరువు ఉంటాయి.

**సుమత్రా ఏనుగు :** ఇవి అన్నిటికన్నా పరిమాణంలో చిన్నవి.

ప్రాచీన భారతదేశంలోనే ఏనుగులను మచ్చిక చేసుకున్నారు. ఇవి కష్టపడి పనిచేసే జంతువులు. అడవులలో భారీ వృక్షాలను పడగొట్టడానికి, తరలించడానికి ఏనుగులను ఉపయోగిస్తారు. ఇలాంటి పనులకు ముఖ్యంగా ఆడ ఏనుగులను ఉపయోగించేవారు. యుద్ధాలలో ఏనుగులను భారతదేశంలోను, తర్వాత పర్షియాలోను ఉపయోగించారు. యుద్ధాలకు ముఖ్యంగా మగ ఏనుగులను వాడతారు. మహారాజులు వేటాడటం కోసం ఏనుగులమీద వెళ్ళేవారు. కొన్ని దేవాలయాలలో ఊరేగింపులలో ఏనుగుల్ని ఉపయోగిస్తారు. జంతుప్రదర్శనశాలల్లో, సర్కస్‌లలో ఏనుగులు ప్రధాన ఆకర్షణ. గజారోహణ విశిష్టమైన గౌరవం. మహారాజులు ఆనాటి గొప్ప కవులను, పండితులను ఏనుగుపై ఊరేగించి సన్మానించేవారు. దక్షిణభారతదేశంలో అన్ని ప్రధాన ఆలయ ఉత్సవాల్లో ఏనుగు సేవలను చేర్చడం రివాజు.

హిందూ పురాణాలలో వినాయకుడు ఏనుగు తలతోనే పూజలందుకుంటాడు. గజేంద్ర మోక్షంలో విష్ణుమూర్తి సుదర్శన చక్రంతో మొసలిని సంహరించి ఏనుగును రక్షిస్తాడు. క్షీరసాగర మధనంలో పుట్టిన ఐరావతం అనే తెల్లని ఏనుగు ఇంద్రుని వాహనము. గజలక్ష్మి అష్టలక్ష్ములలో ఒకరు. భూమిని మోస్తున్న విరూపాక్షం తదితర ఏనుగుల పేర్లు కూడా పురాణాల్లో ఉన్నాయి.





## వృక్ష జాలం

# ప్రాచీన వృక్షం రావి

రావిచెట్టు భారతదేశంలో సామాన్యంగా కనిపించే భారీ వృక్షం. ఇది మర్రి జాతికి చెందిన ఒక చెట్టు. భారత దేశం, నేపాల్, దక్షిణ చైనా, మరియు ఇండో చైనా ప్రాంతాలలో ఈ చెట్టు అధికంగా పెరుగుతుంది. ఇది పొడి ప్రాంతలలోనూ, తేమ ప్రాంతాలలోనూ కూడా పెరిగే పెద్ద చెట్టు. ఇది సుమారు 30 మీటర్లు ఎత్తు వరకు పెరుగుతుంది. దీని కాండం వ్యాసం 3 మీటర్ల వరకు పెరుగుతుంది. దీని శాస్త్రీయనామం ఫైకస్ రెలిజియోసా. ఇంకా దీనిని సేక్రెడ్ ఫిగ్ అని, హోలీ ఫిగ్ అనీ కూడా పిలుస్తారు. హిందీలో దీనిని పీపల్ అంటారు. బీహార్ బుద్ధగయలోని మహాబోధి ఆలయం వద్ద ఒక వృక్షం ఉంటుంది. ఈ వృక్షం కిందనే బుద్ధుడికి జ్ఞానోదయం అయిందనేది చారిత్రక కథనం. ఆ బోధివృక్షమే రావిచెట్టు. దీనిని సంస్కృతంలో అశ్వత్థ వృక్షమంటారు. వృక్షాలలో నేను అశ్వత్థ వృక్షాన్ని అని పరమాత్మ భగవద్గీతలో చెప్పాడు. వినాయకచవితి నాడు విఘ్నేశ్వరునికి ఇష్టమని చెప్పబడే 21 ఆకులతో స్వామివారికి పూజ చేస్తారు. ఆ 21 ఆకుల్లో అశ్వత్థ పత్రి (రావి ఆకు)కు స్థానం ఉంది. రావిచెట్టు హిందువు లకు, బౌద్ధులకు, జైనులకు పవిత్ర వృక్షం. కాగా బుద్ధగయ లోని బోధివృక్షం క్రీ.పూ. 288 నాటిదని అంచనా వేశారు. రావి ఆకులు మొన దేలి ఉంటాయి. 10–17 సెంటీ మీటర్ల వరకు పొడవు, 8–12 సెంటీ మీటర్ల వరకు వెడల్పు, 6–10 సెంటీ మీటర్ల వరకు ఉంటాయి. మర్రి లాగే పక్షుల రెట్టల ద్వారా వ్యాపించే దీని విత్తనాలు కూడా అక్కడ పడి మొలిచి, పెరుగుతాయి. ఇలా ఇతర వృక్షాల మీద పెరిగే మొక్కల్ని ఎపిఫైట్స్ అంటారు.

రావి కాయలు కొమ్మకూ, ఆకు కాడకూ మధ్య జతలు జతలుగా వస్తాయి. కాయలు అడ్డంగా అరంగుళం వ్యాసం కలిగి, లేతగా ఉన్నప్పుడు ఆకుపచ్చగా మెత్తగా ఉండి, పండే కొద్దీ ఎర్రగా రక్తవర్ణానికి మారతాయి. ఆడ పూలు, మగ పూలు వేర్వేరుగా ఉంటాయి. మగ పూలకు మూడు వివర్ణమైన రేకులు ఉంటే, ఆడ పూలకు ఐదుంటాయి. మేడి, మర్రి పళ్ళలో లాగే ఎర్రటి రావి పండు విచ్చదీసి చూస్తే లోపల అసంఖ్యాకంగా ఉండే గింజల వంటివే అసలైన పళ్ళు. అయితే వీటిని విత్తులని వ్యవహరిస్తారు. రావి పళ్ళు పక్షుల్ని బాగా ఆకర్షిస్తాయి. అవి ఈ పళ్ళు తిన్నప్పుడు విత్తులు (పిప్స్) జీర్ణం కాక యథాతథంగా విసర్జించబడతాయి. అలా పక్షుల రెట్టల ద్వారా విత్తన వ్యాప్తి జరిగి, తేమ లభించినప్పుడు అవి మొలకెత్తడం వల్ల రావిచెట్టు పునరుత్పత్తి చేసుకుంటుంది. రావి కొమ్మలు పాతిపెట్టినా కూడా బతుకుతాయి. ఈ విధంగా అడవి వ్యాప్తికి దోహదపడుతుంది. రావి దీర్ఘకాలం జీవించే వృక్షం.

**రావి ప్రయోజనాలు :** కరవు రోజుల్లో రావి కాయల్నీ, లేత చిగురుటాకుల్నీ జనం తినేవారు. రావి ఆకులు బలవర్ధకమైన ఆహారం. వీటిలో 14 శాతం వరకూ ప్రోటీన్లు ఉన్నాయి. రావి ఆకుల్లో గడ్డిజాతి మేతలలో కంటే మూడురెట్లు ఎక్కువ మాంసకృత్తులు ఉన్నాయి. పశువులకు, ప్రత్యేకించి ఏనుగులకు రావి ఆకులు అతి ఇష్టమైన మేత. నైట్రోజెన్, కాల్షియం, ఫాస్ఫరస్ అధికంగా ఉండే కారణంగా గొర్రెలూ, మేకలూ, పశువులకు రావి ఆకులు మంచి మేతగా పరిశోధనలు నిర్ధారించాయి. రావిచెట్టు కాండం నుంచి స్రవించే జిగురును రబ్బర్ టైర్లకు పంక్చర్లు వేసేందుకు ఉపయోగిస్తారు. గట్టిపడిన ఈ జిగురును సీలింగ్ వాక్స్ గానూ ఉపయోగిస్తారు. రావి కలపని ప్యాకింగు బాక్సులు, అగ్గి పెట్టెల తయారీలో ఉప యోగిస్తారు. బండి చక్రాలు, కొయ్య గిన్నెలు, స్పూన్ల తయారీలో రావి కలపను వినియోగిస్తారు. రావి చెట్ల మీద కూడా షెల్లాక్ కీటకం పెరుగుతుంది. ఇది ఉత్పత్తి చేసే రెసిన్ నే షెల్లాక్ అంటారు. షెల్లాక్ విద్యుత్ పరిశ్రమలలో ఇన్సులేటర్ గానూ, సీలింగు మైనం, డ్రాయింగు ఇంకులు, వాటర్ కలర్స్ మొదలైనవాటి తయారీలోనూ వాడతారు. రావి మండలను ఎండబెట్టి, ఆ ఎండిన పుల్లలను నేతితో కాల్చి భస్మం చేసి ఆ బూడిదను తేనెతో కలిపి సేవిస్తే శ్వాసకోశ వ్యాధులు నయమవుతాయి..



# పనుల్లో నాణ్యతకే ప్రథమ ప్రాధాన్యం

## సర్కిల్ సమీక్షలో సిసిఎఫ్ శ్రీ జెఎస్ఎన్ మూర్తి




శాఖాపరంగా నిర్వహించిన ప్రతి పనిలోనూ నిర్దేశిత ప్రమాణాల మేరకు పూర్తి నాణ్యత ఉండేలా చూడాలని, అలాగే రికారులను సక్రమంగా నిర్వహించాలని రాజమండ్రి సర్కిల్ ముఖ్య అటవీసంరక్షణాధికారి శ్రీ జెఎస్ఎన్ మూర్తి అటవీశాఖాధికారులకు పిలుపునిచ్చారు. సర్కిల్ కార్యాలయంలో తూర్పుగోదావరి, పశ్చిమగోదావరి, కృష్ణా జిల్లాలకు చెందిన డివిజనల్ అటవీశాఖాధికారులు, ఫారెస్ట్ రేంజ్ అధికారులతో ఆయన సమీక్ష సమావేశం నిర్వహించారు. ఈ సందర్భంగా ఆయన మాట్లాడుతూ నాణ్యత ప్రమాణాల విషయంలో డిఎఫ్ఓ ల పర్యవేక్షణ, రేంజ్, సెక్షన్ అధికారులతో సమన్వయం అత్యంత కీలకమన్నారు. సాంకేతిక విషయాలపై అవగాహన లోపం, ఒక్కోసారి నిర్లక్ష్యం కారణంగా జరిగే లోటుపాట్లు నాణ్యతపై ప్రభావం చూపితే శాఖకు చెడ్డపేరు వస్తుందన్నారు. దీనిని నివారించడానికి శాఖలో ప్రతి డిఎఫ్ఓ ద్వారా తన డివిజన్ కాకుండా మరో డివిజన్‌లో పనులను తనిఖీ చేయించడం జరిగిందని చెప్పారు. ఇలా వివిధ డివిజన్లలో పలు పనులను తనిఖీ చేసిన డిఎఫ్ఓల పరిశీలనా నివేదికలను పవర్ పాయింట్ ప్రజెంటేషన్ ద్వారా శ్రీ మూర్తి పరిశీలించారు. పనులు జరిగిన తీరు, నాణ్యత ప్రమాణాలపై ఆయా డిఎఫ్ఓలను ప్రశ్నలు అడిగి సమాధానాలు రాబట్టారు. నిర్లక్ష్యం, అవగాహన లేమి కారణంగా జరిగే తప్పులు విజిలెన్స్, శాఖాపరమైన తనిఖీల సందర్భంగా బయటపడుతున్న పరిస్థితి ఉందని, అయితే శాఖాపరమైన సమగ్ర తనిఖీల్లోనే అటువంటి లోపాలు, తప్పులు కనుగొని సరిదిద్దుకోవడం సరైన పద్ధతి అన్నారు. ప్రజలకు దీర్ఘకాల ప్రయోజనాలు చేకూర్చడం, అటవీ సంరక్షణ, వన్యప్రాణుల సంరక్షణ లక్ష్యాలను చేరుకోవడానికి ఈ మార్గం ఉపకరిస్తుందని తెలిపారు. ఇతర డివిజన్లలో తనిఖీలు నిర్వహించిన డిఎఫ్ఓలు తమ నివేదికలకు బాధ్యత వహించాల్సి ఉంటుందన్నారు. రాజమండ్రి, కాకినాడ, చింతూరు, ఏలూరు, విజయవాడ, వైల్డ్ లైఫ్ మేనేజ్‌మెంట్ తదితర డివిజన్ల వారీగా వివిధ పనులను, నర్సరీల తీరుతెన్నులను ఈ సమీక్షలో నిశితంగా పరిశీలించారు. ప్రతి నర్సరీపైనా రేంజ్ అధికారులు వ్యక్తిగతమైన శ్రద్ధను, ప్రేమను కనబర్చాలని సిసిఎఫ్ శ్రీ మూర్తి కోరారు. గత ఇరవై ఏళ్ళ కిందటి వరకూ నర్సరీలు పిక్నిక్ స్పాట్‌లుగా ఉండేవని, అయితే ఇప్పుడు వాటి నిర్వహణ అధ్వానంగా ఉండడంతో ప్రజలు వాటికి దూరమవుతున్నారని పేర్కొన్నారు. వనం-మనం, నీరు-చెట్టు, ఇలా వివిధ కార్యక్రమాలకు అవసరమైనన్ని మొక్కలను, విరివిగా రహదారుల వెంబడి ఎవెన్యూ ప్లాంటేషన్లు వేసేందుకు వీలుగా పొడవు మొక్కలను నర్సరీల్లో సరైన ప్రమాణాలతో పెంచాలన్నారు. కొన్ని నర్సరీలలో బ్యాగ్ ఫిల్లింగ్, ట్రాన్స్‌ప్లాంటింగ్ చర్యలను ఇప్పుడు చేపట్టడంపై అసంతృప్తి వ్యక్తం చేశారు. దీనివల్ల బతికే మొక్కల శాతం తగ్గిపోతుందన్నారు. కాలానికి అనుగుణంగా మొక్కలను పెంచే ప్రణాళికను నర్సరీల్లో పాటించడం అనివార్యమన్నారు. డిఎఫ్ఓల తనిఖీ నివేదికల్లో తెలిపిన వివరాల మేరకు వివిధ నర్సరీల అధికారు లు, డిఎఫ్ఓలకు తగు ఆదేశాలను ఇచ్చారు.

ప్రసిద్ధ పర్యాటక స్థలమైన కొల్లేరు పక్షుల అభయారణ్యం పొడవునా సందర్శకులకు అవసరమైన ఏర్పాట్లు చేయాలని సంబంధిత అధికారులను ముఖ్య అటవీసంరక్షణాధికారి ఆదేశించారు. ఒక్క ఆటపాక గ్రామం వద్ద మాత్రమే పక్షుల సందర్శనకు తగిన ఏర్పాట్లు ఉండడాన్ని ప్రస్తావిస్తూ మరో ఐదారుచోట్ల ఇలాంటి ఏర్పాట్లు వెంటనే చేయాలని ఆదేశాలిచ్చారు. పెరిఫెరల్ ట్రెంచ్‌ల తవ్వకాన్ని ఇకపై అటవీప్రాంతం హద్దుల వెంబడి మాత్రమే సాగించాలన్నారు. అటవీభూముల పరిరక్షణను ప్రతి అధికారి ప్రథమ కర్తవ్యంగా భావించాలన్నారు. ప్రస్తుత ఆర్థిక సంవత్సరం యాక్షన్ ప్లాన్‌లోని వివిధ అంశాల్లో లక్ష్యాలు, గత సంవత్సరంలో సాధించిన లక్ష్యాలను సమీక్షించారు. సీడ్ కలెక్షన్‌ను అశ్రద్ధ చేయరాదన్నారు. విత్తనాల సేకరణ కార్యక్రమంలో వనసంరక్షణ సమితులను పెద్ద ఎత్తున భాగస్వామ్యం చేయాలన్నారు. ప్రతి రేంజ్ పరిధిలోనూ 30 హెక్టార్ల కొండ ప్రాంతాన్ని పునరుజ్జీవింపజేయాలని (హరిత మన్యం) ప్రభుత్వం నిర్దేశించిందన్నారు. కాకినాడ డిఎఫ్ఓ డాక్టర్ శ్రీమతి నందని సలారియా, రాజమండ్రి వైల్డ్‌లైఫ్ డిఎఫ్ఓ శ్రీ అనంత్‌శంకర్, ఏలూరు డిఎఫ్ఓ శ్రీ నాగేశ్వరరావు, చింతూరు డిఎఫ్ఓ శ్రీ శ్రీనివాస్, విజయవాడ డిఎఫ్ఓలు శ్రీ బెనర్జీ, శ్రీ ప్రభాకరరావు, రాజమండ్రి లాగింగ్ డిఎఫ్ఓ శ్రీ రాజశేఖరరావు, స్క్వాడ్ డిఎఫ్ఓ శ్రీ ఎంవి ప్రసాదరావు, కాకినాడ ఎస్ఎఫ్ డిఎఫ్ఓ శ్రీ రామకృష్ణ, చింతూరు లాగింగ్ డిఎఫ్ఓ శ్రీ కొండలరావు తదితరులు పాల్గొన్నారు.

**BOOK POST** APTEL 15625

(Printed Matter)

To. ______________________

______________________

______________________

**P.S :** If not delivered,
Please return to..
The Director,
A.P. State Forest Academy
R.F.R.C. Complex
Lalacheruvu,
Rajamahendravaram- 533106

ప్రచురణ: ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర అటవీ అకాడమీ సంచాలకులు మరియు ముఖ్య అటవీ సంరక్షణాధికారి, రాజమహేంద్రవరం సంయుక్త ఆధ్వర్యంలో...